సర్వస్వామ్యములు గ్రంథకర్తవి
ప్రథమ ముద్రణ 1000 ప్రతులు

మూల్యము రూ 10/-

ప్రతులకు
కోసంగి సిద్ధేశ్వర ప్రసాద్
కృష్ణవేణినిలయం
2/75, మెయిన్ బజార్
రైల్వేకోడూరు - 516 101.
కడప జిల్లా

ముద్రణ
ఉదయకుమార్ ప్రింటింగ్ వర్క్స్
రైల్వేకోడూరు.

# నివేదన

మాతల్లిదండ్రులకు శ్రీతలకోనక్షేత్ర సిద్ధేశ్వర వరప్రసాదమున జన్మించిన నేను శివభక్తుండను. సిద్ధ సేవ్యుడైన సిద్ధలయ్యను సంబోధిస్తూ ఆదేవుని కరుణా కటాక్షవీక్షణముచే సిద్ధలయ్య నీతి ద్విశతివ్రాసితిని.

అక్షరాభ్యాస మొనర్చినది మొదలు దగ్గఱ గూర్చుండ బెట్టి కొని విద్యాబోధన మొనర్చి నన్నింత వానిని జేసిన నాతల్లి గారికిని, నాకుప్రాథమిక విద్య గఱపిన దేశికోత్తములగు శ్రీ పిశుపాటి సుబ్రహ్మణ్యము, శ్రీ కోలు వెంకట సుబ్బయ్య, శ్రీకాకాండము లక్ష్మీనరసింహరావు గార్లకును, నాచే రచింపబడు కృతులను సవరించి తమ సంపాదకత్వమున వెలువడు ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య లో ప్రచురించుచు బరోక్షమునవే నన్ను శిష్యునిగ సంగీకరించిన వారును, అనేకోద్గ్రంథకర్తలునగు శ్రీ మహావాది వేంకటరత్నము గారికిని నాహృదయ పూర్వక కృతజ్ఞతాభి వందనములను సమర్పించుకొనుచున్నాడను.

నేకోరినంతనే నాయీగ్రంధమునకు తమ యాశీస్సులు అభిప్రాయము లొసగిన మామేనమామ వేదము చంద్రశేఖరయ్య గారికిని, మహాకవి శ్రీ భూతపురి సుబ్రహ్మణ్య శర్మగారికిని సహజకవి శ్రీమట్టిపల్లి మల్లినాథ శర్మగారికిని, పండితకవి శ్రీ గౌరిపెద్దిరామసుబ్బశర్మ గారికిని, లలితకళానిధి శ్రీ వ్యైనంపాటి వేంకట సుబ్రహ్మణ్యము గారికిని, డాక్టర్ శతావధాని శ్రీ సి.వి. సుబ్బన్నగారికిని అనేక కృతజ్ఞతా నమస్కారములు.

గ్రంధముద్రణకై ద్రవ్యమొసంగిన శ్రీ కొప్పురపు నరసింహులు గారికిని అనతి కాలంలో ఈ సిద్ధలయ్యనీతి ద్విశతిని సర్వాంగ సుందరముగ ముద్రింపించి సకాలమునకు మనకందించిన ఉదయకుమార్ ప్రింటర్స్.అధినేత శ్రీకొండూరు ఉదయకుమార్ గారికిని సిరిసంపదలు భోగభాగ్యములు కలిగి పుత్ర పౌత్రాభివృద్ధిగ నుండునట్లు భగవంతుని ప్రార్థిస్తూ అనేక ఆశీః పూరిత అభినందనలు తెల్పుకొను చున్నాడను. ఇట్టి విషయమున దొలుతనుండి నన్ను బ్రోత్సహించు చున్న నాంధ్ర సోదరులకెల్ల హృదయ పూర్వకముగు జోహారులు.

కృష్ణవేణి నిలయం
రైల్వేకోడూరు
1.3.2001.

ఇట్లు
నివేదించు
**కోసంగి సిద్ధేశ్వర ప్రసాద్**

## గ్రంధ ముద్రణ ప్రదాత

కీ.శే. కొప్పరపు ఆంజనేయులు శ్రేష్ఠిగారికుమారుడు

చిరంజీవి

**శ్రీ కొప్పరపు నరసింహులు శ్రేష్ఠిగారు**

కడప జిల్లా ఆర్యవైశ్యసంఘం ఉపాధ్యక్షులు

రైల్వే కోడూరు ఆర్యవైశ్యసంఘం అధ్యక్షులు

వీరి నెల్లవేళల తలకోనక్షేత్ర సిద్ధేశ్వరస్వామి సిరిసంపదలు భోగభాగ్యముల నిచ్చి కాపాడు గాక!

వినీతుడు
కోసంగి సిద్ధేశ్వర ప్రసాద్



## ఆశీస్సు

శ్రీ లలనా వదనాంబుజ
బాలార్కుఁడు వేంకటాద్రివాసుఁడు ప్రేమన్
బాలించున్ దీర్ఘాయు
శ్శ్రీ ల నొసఁగి సతతంబు సిద్దేశ్వరునిన్

కరుణారస మందిరుఁడా
గిరిజాపతి ప్రేమ మీరఁ గీర్తిన్ విద్యన్
జిర సంపదలన్ సిద్దే
శ్వరునకు నొడగూర్చి ప్రోచు సంతత మవనిన్

కోసంగి వంశ వర్ధను
శ్రీ సిద్దేశ్వర కవీంద్రు శిష్టగుణ నిధిన్
భాసుర రచనా నిపుణుని
వాసవముఖ దేవసమితి పాలించు సదా.

శతకము రచింప గల్గుట
మతిమంతుల కగునుగాని మరినేర్తురకో
యితరులు? సిద్దేశ్వర! నీ
కతి సహజము! నిన్ను బ్రోచు నా శివుఁడెపుడున్.

వినఁగ వినఁగ తీపు వేమన నీతులు
వాని సమముగాఁగ వ్రాసినావు
సిద్దులయ్య నీతి ముద్దు లొల్కెడు రీతి
సిద్దయార్య! నిన్ను శివుఁడు బ్రోచు

ఎగ్మూరు
మద్రాసు - 8

రసపిపాసి
వేదం చంద్రశేఖరయ్య

మహాకవి శతావధాని కవి సార్వభౌమ సువర్ణకవి గండపెండేరభూషిత
భూతపురి సుబ్రహ్మణ్య శర్మ
శ్రీ రామాయనమః

శ్రీ కోసంగి సిద్దేశ్వర ప్రసాద్ గారు సంతరించిన సిద్దులయ్య నీతి ద్విశతిని జదివి సంతోషపడితిని. ఆటవెలఁదులతో ఆద్యంతము ఈ కవి రచన సాగించుట వలన ఇతఁడు వేమన ననుకరించిన వాఁడని సుస్పష్టమగుచున్నది. కావ్యారంభమును 'ఓంనమశ్శివాయ' అను పంచాక్షరీ మంత్రముతోఁ బ్రారంభించుట వలన ఈకవికి శైవ భక్తి పారమ్య మతిశయమని తోఁపక మానదు. అయినను హరిమీఁద కూడ నీకవికిఁ గలభక్తి అనన్యసామాన్యము. రచనాశైలి మృదుమధురము. ధార ద్రాక్షా కదలీ పాకములతో నడచినది. వ్యవహారములోని నుడికారములను సామెతల నుపయోగించి కావ్య మాద్యంతము సకలజనప్రియము గావించినాఁడు. సాంప్రదాయిక రచనలు సడలుచున్న ఈ రోజులలో ఛందో బద్ధముగ రచన సాగించుట యొక సాహసకార్యము. ఇతని పూర్వకృతి విఘ్నరాజశతకమును మునుపు చదివి ఈ కవి మంచి భావుకుఁడని గుర్తించితిని. ఇతఁడద్వైతి యనుటకు.

హరిని గాదటన్న హర భక్తుఁడే గాఁడు
హరుని గాదటన్న హరికి గాఁడు
హరి హరు లొకటంచు నాత్మలోనెఱుఁగుము
సిద్దసేవ్య ! దివ్య! సిద్దులయ్య.

అనుపద్యము ప్రబల సాక్ష్యమిచ్చు చున్నది. ఈకవి రామాయణ భారత భాగవత గ్రంథములనేకాక ఆధునిక శివభారతాది కృతి కథాంశములను నీతులందు సిద్దులయ్య పరముగ బోధించినాఁడు 'సిద్దులయ్య నీతి' అని కావ్యమునకు నామకరణము చేయుట లోనేకాక ఔచిత్యము గోచరించును. అది యేదియన - సిద్దేశ్వర ప్రసాద్ నీతులని భావము కలుగుట కేమో! కవిగారు పైవిధముగ నామకరణము చేసి 'సిద్ద సేవ్య! దివ్య! సిద్దులయ్య!' అనుమకుటముయును ప్రతిపద్యము చివర వేసినట్లు తోఁచును 'విశ్వదాభి రామ వినుర వేమ' అను మకుటమునకు ప్రతికాశముగ పైమకుటము శోభిల్లుచున్నది. అతి సులభముగు శైలిలో రచించి సామాన్య పాఠకులు చదివి యానందించుటకు కవి శ్రమపడినాడు.

45 పద్యములో కవిగారు 'ఆకాశాత్పతితం తోయం యధాగచ్ఛతి సాగరం, సర్వదేవ నమస్కారం కేశవం ప్రతిగచ్ఛతి' అను అనుష్టుపు శ్లోకార్థము నిమిడ్చినాఁడు. ఇట్లే 94,96 పద్యములలో రామాయణ మందు రాముఁడు విభీషణునకు శరణాగతిని బ్రసాదించు నపుడు' మిత్ర బలేన సంప్రాప్తం, నత్యజేయం కథంచన అభయం సర్వ భూతేభ్యః ఇతిమద్వ్రతం అన్న మాటల కర్థము ప్రతిభాసించును.

ఇట్లే, చెప్పుచు బోయిన ప్రతి పద్యమున ఒక కావ్యార్థము ధ్వనించును. ప్రాయము మీరినవాఁడు ఏదో 'రామా కృష్ణా శివా' అని కవిత్వము వ్రాయుట పరిపాటి; కానీ కవిగారు 'శివా' అని పిలుచుచూ అనేక మనోహర నీతులు గుప్పించినాఁడు 'స్వయం తీర్ణః పరాన్ స్తారయేంత్' అను నీతి ననుసరించి కవిగారు తాను అనుష్ఠించి, తరించి, ఇతరులను తరింపఁజేసినాఁడు. ఆస్తిక వరేణ్యులగు సర్వమతములకు సర్వ జాతులకుపయోగపడు గ్రంథమియ్యది. ఇతనితోఁ బరమేశ్వరుఁడింకను ఇట్టి ఉత్కృష్ట రచనలను చేయించుఁగాక!

ఇతి, శం,
'భూతపురి'

## ఆముఖము

ఉభయ శ్రీ విరాజితులు సరళ కవితా సిద్ధహస్తులు సిద్దేశ్వర ప్రసాద్ బావగారికి నమస్కారములు

మీరంపిపన సిద్దులయ్య నీతి (ద్విశతి) వ్రాత ప్రతి పద్యమును జదివితిని. రచన సరళముగా మన వేమన, భర్తృహరి, సుమతి శతకము మున్నగు వాని భావములు భంగ్యంతరముగాఁ జొచ్చుకొనిసాగినవి. మఱియు ఉపనిషత్తులు భగవద్గీతమున్నగు వానిలోని విషయమును సంగ్రహముగా ఆధునికులగు మాబోంట్లకేగాక ఆటవెలదికి ని ఎక్కించితిరి.

మీరచనలోని ఒక్కొక్క పద్యము సంస్కృత శ్లోకమో తెలుఁగు కావ్యములలోని పద్యమో మూలమని పద్యములు చెప్పక చెప్పుచున్నవి. పాకము వేఱగుటచే మీ ఆటవెలఁదిని వదల బుద్ధి పుట్టుటలేదు.

మీ రచన పై ఆముఖమును నన్ను వ్రాయఁ గోరుట నాపై మీాయభిమానమునకు తార్కాణయేగాని నాకు ఆశక్తి కలదా అని నాయనుమానము. అయినను తోఁచినంతలో నాలుగు మాటలు వ్రాయుట సాహసమేమో! – 'ఏమి పండితుండో' – 49 అను పద్యము 'తత్కార్మ యన్న బంధాయ సా విద్యా యా విముక్తయే ఆయాసాయాపరం కర్మ విద్యాన్యా శిల్ప నైపుణమ్' అను శ్లోక వ్యాఖ్యను తెలుపు మన్నది. 'పృథివిఁ బడిన బిడ్డ' 58 అను పద్యములో మూఁడవ పాదము జగతి మిథ్య అనుటనే తెలుపు మన్నది. 2వ పాదమున 'హాయిరా' అనునది జగతి మిథ్యా అని తెలిపి నందువలన అట్లు తెలిసిన వాఁడు పొందు ఆనందమే అని తెలుపును. తల్లి ఆ పంటి బిడ్డ యొక్క దశలో నున్న సుఖమే స్థిరమైనదని ప్రతి వ్యక్తియుఁ బొందఁదగినది అని తెలుపును. దీనినే – యత్ర నాన్య త్పశ్యతి నాన్యత్ శృణోతి, నాన్యద్విజానాతి స, భూమా భూమైవ సుఖమ్ యత్రాన్యత్పశ్యతి, అన్యచ్ఛృణోతి అన్య ద్విజానాతి తదల్పమ్– అని ఛాందోగ్యోపనిషత్తు (7-24-1) తెలుపుచున్నది. 'తప్పు చేయు వాఁడు' ఇది భారతము శకుంతలో పాఖ్యానములోని విమలయశోనిధీ! పురుష వృత్త మెఱుంగు చునుండుఁ జూవె వేదములును, పంచభూతములు ధర్మవునంతరాత్మయున్ యముఁడును చంద్ర సూర్యులు నహంబును రాత్రియు నన్మహా పదార్థము లివియుండఁగా నరుఁడు తక్కొన నేర్చునె తన్ను ద్రిమ్మరిలన్' అను పద్యమును తలఁపించు చున్నది. 'విద్యయున్న నేమి' 51 ఇది దుర్జనః పరిహర్తవ్యో విద్యయా లంకృతో పిసన్ – మణినా భూషిత స్సర్పః కిమసే నభయంకః అను శ్లోకముసారముగా వెలసినది. నాది యేమి లేదు 93 ఈ పద్యములో సర్వ ధర్మాన్ పరిత్యజ్యమామేకం శరణం వ్రజ అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః అను భగవద్గీత శ్లోకసారముగా దెలియుచున్నది. – 'శివుని మెప్పు పొంది' 104 ఈ క్రిందిబాషలోని ఒక సూక్తికి ఛాయా మాత్రానుకరణము గా నున్నది. "Perseverance is the sure road to success" 'పావురంబుఁగాప' 107 దీనిలో శతేషు జాయతే శూరః సహస్రేషు పండితః వక్తా దశ సహస్రేషు దాతాభవతి వానవా అని దాతృత్వము యొక్క మహత్వమును దెలుపు భావము ఇమిడి యున్నది. ఉదాహరణ ముండుట శోభాజనకము 'పెద్ద వారి తోడ స్నేహము సేయకు' 194వ పద్యములో పూర్వార్థమునకు హేతు భూతముగ మూఁడవ పాదములోని కాయ మస్థిరంబు అనుటను గూర్చి శ్రీమజ్జగద్గురు శంకరాచార్య స్వామి వారు దుర్వాసనా ప్రతీకారము గో ఆయుర్గచ్ఛతి పేటికా జలమివత్యక్త్వైవ దేహం జనాత్, గచ్ఛంత్రీందియ

శక్త యోపి కులటాయద్వన్నరం నిర్ధనమ్, ప్రజ్ఞా గచ్ఛతి దానదాహ సమయే నీడం ఖగేంద్రఇవజ్ఞాత్వా సత్వర మాశ్రయాత్మ పదవీం దేహం వృథాః! అని సెలవిచ్చి యున్నారు. 'మంచినెన్ని దాని మఱిమఱి'210 అను పద్యము నందలి'బావమెట్టులున్న పరిణామ మట్లగు' అను భావమునకు మూలముగా మంత్రీ తీర్థే తథాదైవేజ్ఞ్యే భేషజేగురౌ! యాదృశీభావనాయుత సిద్ధిర్భవతి తాదృశీ అనుశ్లోకము ప్రస్తావింపఁదగియున్నది. అబ్బుమండు అను పద్యములో బద్దెన పద్దెముగా ప్రసిద్ధిలోయున్న సిరిదా వచ్చిన వచ్చును అను పద్యమున సిరాదాఁ బోయినఁ బోవును కరిమ్రింగిన వెలఁగ పండు కరణిని అన్నచోట ఏనుఁగు అని అర్థమే స్ఫురించును. కపిత్థాంతర్గతః కీటోగజ ఇత్యభిదేయతే అని గజశబ్ద నిర్వచనము. బద్దెన గజమును కరిగా మార్చగా ఆకరి ఇచ్చట గజముగనే యున్నది. ఇంతకు గజము అనఁగ వెలఁగ పండులోని గుజ్జును పూర్తిగాఁ దినివైచి పైకి వెలఁగ పండుగానే కనఁబఱచు పురుగు అని అర్థము చెప్పవలయునని పై నిర్వచనము తెలుపు చున్నది. ఇట్లు పద్యములను గూర్చి ముచ్చటించుఁ బోయినచో ఈ ఆముఖమే పెరిగి పోవునను భయముతో ఈ నాలుగు మాటలు వ్రాయు నవకాశము గల్పించిన మీకు
నా కృతజ్ఞతాంజలిఁ దెలుపుచున్నాను.

ఆట వెలఁది జూచి నంతనే ముదిమితో
జవ్వనంబు చెలిమి సలుపు నేమొ!
కవిత వనిత తోడు గాఁగ సన్మార్గాన
వెడలె సుంత నదరు బెదరు లేక!!

ఇట్లు - బుధజన విధేయుఁడు
వట్టిపల్లి మల్లినాధ శర్మ

ముందు మాట

శ్రీ కోసంగి సిద్దేశ్వర ప్రసాద్ గారు గొప్ప మనస్సుతో
'సిద్దులయ్య నీతి ద్విశతి'ని పంపి దాదాపు రెండు మాసములైనవి. అప్పుడప్పుడు కొంత కొంతగ నెమరు వేసికొంటిని. - వీరి రచన ధారాళమైనది తొణకు తొందర, ముందు వెనకల తిరిగి చూచుకొను పద్ధతియు ఈ రచనమున కన్పడవు నడచుచు నుండు వాని చరణంబులకే కద రాళ్ల తాకిడుల్ అన్నట్లు అక్కడక్కడ దొర్లిన కొన్ని శబ్ద ప్రమాదములు ఈ కృతికి భూషణములే కాని దూషణములుకావు కావు.

శతకముల చరిత్ర విచిత్రమైనది. ఇవి శతకములై, ద్విశతులై, త్రిశతులై, పంచశతులై, సప్తశతులై ఇంకా ఇంకా ఎన్నో రూపములతో వెలసినాయి. మరికొన్ని పాదుకాసహస్రము ఇత్యాదిగా సహస్ర సంఖ్యతో గూడ వెలసినాయి. పెద్దలు వెలయించిన వానిలో గుణదోషగణనాధి కారము మనకు లేదు.

సంస్కృతమున సుందరపాండ్యుని ఆర్యా ద్విసప్తి యొక్కటి విచిత్రముగ వెలసినది. మాతలకోన సిద్దేశ్వరుని పేరుతో సిద్ధులయ్య ద్విశతి వెలయుట గ్రంధకర్తకూ నాకూ నొక విశిష్ట సంబంధము.

ఈ ద్విశతిలో పరమాణువు మొదలు పరబ్రహ్మ వరకు యధోచితముగ తిరస్కార పురస్కారపాత్రము లైనవి. రాజకీయ నాయకులు కొందరు పైకెత్తబడినారు. గ్రంధమంతయు వేమన రీతిలో సాగినను కొన్నింటిలో (29 వ) సమాధానము కావలసియున్నది. 32వ పద్యము నీల కంఠదీక్షితునీ శివోత్కర్షమంజరి 'లోని 'అర్చామీతి ధియాయదేవ కుసుమం క్షిప్త్వాజనోముచ్చతే! విధ్యామీతిధియా తదేన వికిరన్ భస్మీ కృతో మన్మధః ! ఇత్యాభ్యంతర వృత్తి మాత్ర రసికః బాహ్యోనపేక్షస్త్వయః సస్వామి మమదైవతా తదితరోనామ్నాపి నామ్నాయతే 'పద్య భావమును సూక్ష్మముగ నంజుకొన్నట్లున్నది, 58 పద్యము లాలిలోని సత్యమును విప్పి చెప్పినది. 76వ పద్యము ఒకప్పుడు నేను చెప్పిన పద్యము భావముతో పోలియుండుట చూచి ఆశ్చర్యపడితిని.

నాపద్యము:– పాపమనునది మనసును బట్టి యుండు
దేహమున కంట దెట్టులు తెలిసి చూడఁ
గూఁతుఁ బ్రియురాలి నొకయెదఁ గూర్తుము కద
కానఁ గడఁ గుండు మనసును గట్టి పఱచు.

117,118,119,121,123 పద్యములు వీరి లోకజ్ఞ తను ధర్మతత్పరతను చాటుచున్నవి. ఇట్లుదహరించినచో సద్దికి మూడింత ఊరగాయగా నాముందు మాట కానున్నది. సహృదయులకు కూడ జిహ్వికా న్యాయముగ కొన్ని పద్యములు ఎత్తి చూపితిని. గ్రంధకర్త ఇట్టి శతకములతో గాక మహాకావ్యమొక దానిని వ్రాసి లోక మన్నన వడయుదురు గాక!

గొ॥ రామ సుబ్బశర్మ
తిరుపతి

లలిత కళానిధి విద్వాన్ & ఆర్టిస్టు మైనంపాటి వేంకట సుబ్రహ్మణ్యం

## మిత్ర వాక్యం

తెలుగు సాహిత్యంలో శతక రచన కొక ప్రత్యేక స్థానమున్నది. ఎన్నో శతకాలున్నాయి. సంఖ్య చెప్పలేము. ఈ శతక సాహిత్యం విస్తరిస్తున్నట్లు మరే సాహిత్యం విస్తరించడం లేదన్న అతిశయోక్తి కాదు. ఈశతక వాఙ్మయాన్ని పరిశీలించ వలెనన్న పయోధి నీది నట్లేయగు. పరిశీలించి వాని విశేషములు లోకమున కందించిన పెద్దలు కొందరే వున్నారు. వారిలో విద్వత్కవిభూషణులు శ్రీవేదం వేంకట కృష్ణ శర్మ గారొకరు. 'శతక వాఙ్మయ సర్వస్వము' అనుపేర నెన్నో వ్యాసాలు వ్రాసి మాతృసేవామున్నగు పత్రికల్లో ప్రకటించారు. మలి భాగము వెలువరించకనే వారు కీర్తిశేషులైనారు. శ్రీ శర్మ గారి మేనల్లుఁడే ఈ 'సిద్దులయ్య నీతి ద్విశతి' కర్త శ్రీ కోసంగి సిద్వేశ్వర ప్రసాద్ గారు వీరు నాకు బాల్య మిత్రులు.

ఈ ద్విశతి ఆటవెలఁది లో తీరినది. చక్కని రచన తమకు తెలసిన నీతులు లోకమే ఇతివృత్తంగా ప్రజానీకాన్ని హెచ్చరించడానికి ఉపయోగించుకొన్నారు

వీరు నాటకాలు వ్రాయుటేకాక నటించుటయందు అభిరుచికలవారు. నాటక పోటీలలో ఉత్తమ బహుతులు గెల్చుకోవడమేగాక సినిమా రంగములో ప్రవేశించి నటించారు.

మాచిన్ననాడు మాకు రచనలో నటనలో అభిరుచి కల్గించిన మహనీయులు మా ఉపాధ్యాయులు శ్రీ కె.ఎల్.నరసింహారావు గారు వారు స్వయముగా కవులు. నటకులు హాస్యరస ప్రధాన పాత్రధారణమున్న వారికెంత అభిమానమో! తమ విద్యార్థులు తమ వలె రచయితలు నటకులు కావలెననెడి ఆకాంక్షతో వారు మా యందు చూపెడి అభిమానం ఆదరం మిక్కుటం.

ఈ కవి మిత్రునికి మేనమామ విద్వత్కవిభూషణుల అనురాగం సాహిత్య మార్గంలో చక్కగా నడిపినది. వీరి సిద్దులయ్య నీతి శతకంలో లోకరీతి విపులంగా చూపినారు పురాణ, చారిత్రక, సాంఘిక విశేషాలు సూచించి నీతిబోధ చేసినారు. శ్రీశేషాచల పశ్చిమ సానువుగ వెలసి యున్న శ్రీతలకోన సిద్దేశ్వర స్వామి భక్తులు. వీరి పేరు సిద్దేశ్వర ప్రసాద్ కావున తాను చెప్పిన నీతి ఉభయ తారకంగా సిద్దులయ్య అనుమకుటంతో కూర్చినారు. వీరు ఏ నీతి వాక్యము సూచించినా యోగి వేమన నీతివలె సూటిగా పాఠకుని హృదయాన్ని తాకి కదిలించి ఆచరింపజేస్తుంది. అందుకు ఈ శతకం చక్కెర బొమ్మ! చవి చూడండి.

శ్రీ సిద్దేశ్వర కృపాకటాక్ష కవితా శ్రీ వైభవాలంకృతిన్
మీ సత్కావ్య విలాస వైఖరులు సంవృద్ధిన్ వహించెన్ మహిన్
మీ సూక్తుల్ నిజజీవితావధులకున్ మేల్గూర్చు మార్గమ్ములై
ఓ సిద్దేశ్వర సత్కవీ! వెలయు; మీ యౌన్నత్యమేపారగన్!

బుడుగుంగపల్లె — భవదీయుడు
రైల్వే కోడూరు — మైనంపాటి వేంకట సుబ్రహ్మణ్యము

డాక్టర్ సి. వి. సుబ్బన్న శతావధాని
ఆణిముత్యము

సత్సంగి శ్రీకోసంగి సిద్దేశ్వర ప్రసాద్ గారికి నమస్కారకుశలోపరి తమ ద్విశతి కృతి చదివి యానందించితిని.

ఆ॥వె॥ పాప ఫలము నీవు భరియింపవలెగాని
దేవు వేడినంతఁ దీరిపోదు
చేయఁబోకు మింకఁ జెనటి కార్యంబులు – 35వ పద్యము

ఈ పద్యము సర్వ ప్రపంచము గ్రహింప దగిన ఆణిముత్తెము.

'తప్పు దిద్ది తీర్చి దరి జేర్చుటయే లెస్స' 87వ పద్యము అని స్త్రీ పట్ల చూపిన యౌదార్యము మంచిదే; కాని స్త్రీని నమ్మరాదను మీయభిప్రాయముతో నేనేకీభవింపలేను.

ద్రౌపది – 'ఆఱవ పతి గోరె' (111 వ పద్యము) నను కథ వ్యాస భారతమున కనబడదు. తెనుగు కవులును వ్రాయలేదు. కన్నడ , బారతమున తరువాత అరవ భారతమున పండు కథ చోటు చేసుకొన్నది. స్త్రీ యొక్క కామాధిక్యము ప్రస్థాపించుచు, షష్ఠోమే రోచతే పతిః మున్నగు శ్లోకము లెవరో వ్రాసి లోకమున వదలి యుందురు. వేమన యోగి సూక్తులవలె తమ సూక్తులును చిరకాలము లోకమున నిలువ గలవు నాకు నచ్చిన సూక్తులివి:–

తల్లి కంటె గలదె దైవంబు వేఱొండు; చిన్న చీమకైన చెడుచేయరాదు; గడ్డమున్నయంత దొడ్డయగునె; రంకుచే నహల్య రాయిగా మాఱదా, ప్రాణభీతియందుఁ బాడి తలంపరు.

చిత్తగింతురు
సి. వి. సుబ్బన్న శతావధాని

## సిద్ధులయ్య నీతి ద్విశతి

'ఓం నమశ్శివాయ' నొగి నిష్ఠ జపియింపఁ
దొలఁగు పాప పంక్తి వెలయు జయము
అన్య మెంచ నేల యవనిలో జనములు,
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 1

నాగ హార ! భస్మ రాగ ! దిగంబర!
నిత్య! సత్య రూప! నిటల నయన!
యనుచు నెంచ నబ్బు నభవుని సన్నిధి,
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 2

మందహాస వదన! మందాకినీధర!
నందివాహ! ప్రమద నాథ! నిన్ను
మాన్య బూజసేతు మందార పుష్పాల,
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 3

శివ! గిరీశ! చంద్రశేఖర! వృషవాహ!
నీలకంఠ! సాంబ! నిగమవేద్య!
అనుచు నిరతమెంచ నాశయ సిద్ధియౌ,
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 4

వామదేవ! యగ్ని సోమార్క లోచన!
దేవ మౌని వంద్య! దేవ దేవ!
అనుచు మదిని దలఁప నమరు సౌఖ్యమ్ములు,
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 5

యక్ష రూప! జటి! దిగంబర! హర! దీప్త!
నట! సనాతనా! పినాక పాణి!
అనుచు భక్తిఁ దలఁప నణఁగు పాపౌఘమ్ము,
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 6

పరమ మంత్రమైన  పంచాక్షరీ స్తోత్ర
మును రచించి నట్టి పుణ్య నాది
శంకరుని మదాత్మ సంస్తుతి సేయుదు
సిద్ధ సేవ్య ! దివ్య!  సిద్ధులయ్య. 7

పలుక జేయువాఁడు పరమ శివుఁడ వీవె
పలుకు నదియు నాదు ప్రభుఁడ వీవె!
పలుకు వాఁడ నీతి పలువురు మెచ్చంగ
సిద్ధ సేవ్య ! దివ్య!  సిద్ధులయ్య. 8

భావ యుక్తమగుచుఁ బలువురు సదువంగ
వ్రాయు కవిత కవిత వాస్తవముగఁ
జపులు లేని కూరజనులు మెచ్చరుగదా!
సిద్ధ సేవ్య ! దివ్య!  సిద్ధులయ్య. 9

అలరు మొగలికోన,  తలకోన, నెలకోన
క్షేత్రములను వెలయు సిద్ధ రూప!
శ్రీ గురప్ప దేవ! చేమోడ్తు కాపాడు
సిద్ధ సేవ్య ! దివ్య!  సిద్ధులయ్య. 10

శిష్ట జనులఁ బ్రోవ సిద్ధేశ్వరుండనఁ
బార్వతమ్మఁ గూడి భద్ర గతిని
వెలసి నావు నీవు తలకోన తీర్థాన
సిద్ధ సేవ్య ! దివ్య!  సిద్ధులయ్య. 11

వెతికి యెచట విన్న వేమన్న నీతులే
మొదట నతని  మ్రొక్కి పిదప
పలుకఁదొడగి నాఁడ  పలు నను భూతుల
సిద్ధ సేవ్య ! దివ్య!  సిద్ధులయ్య. 12

పూర్వ కవుల నెంచి పూజింతు మదిలోన
నేటి కవులఁ గొలుతు నిండు మదిని
రసిక వరుల నెల్లఁ బ్రార్థింతు నెప్పుడు
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 13

తల్లి కృష్ణవేణి తండ్రి లింగం భట్లు
నీదు వరము చేత నీదు పేరఁ
బ్రభవ మంది నాఁడ రైల్వె కోడూరున
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 14

తల్లి తండ్రి గురువు దైవమ్ము లెంతయుఁ
బూజ నీయులనెడు బుద్ధి నెంచి
వారి సేవఁ జేసి వర్ధిల్ల వలెనోయి
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 15

కడుపు నందు మోసి, కని, పెంచి, పాలిచ్చి
విద్య నేర్పఁబంచి బుద్ధి గరపి
ప్రజలఁ జేర్చు తల్లి ప్రత్యక్ష దైవమ్ము
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 16

లాల యుగ్గుఁ బోసి లాలించి పాలించి
జోలఁ బాడి బిడ్డ సుఖముఁ గోరు
తల్లి కంటె గలదె దైవంబు వేఱొండు
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 17

తల్లి తండ్రి సేయు తప్పులు నొప్పులు
వారి సంతుఁ జేరి వదల కుండు
నరయ పితలె సుతుల కాదర్శ మూర్తులు
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 18

పుత్రుఁడొకఁడు పుట్ట పున్నామ నరకంబు
పాయు ననెడి సూక్తి వరలుఁ గాన
ఇహము నందు పుత్రుఁడింపుఁ గూర్పవలదె?
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 19

కన్నవారి పైన కాసంత దయలేక
కష్ట పెట్టువాఁడు ఖలుఁడు గాఁడె
పుట్ట జెదలు పుట్టి గిట్టదా లోకాన
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 20

తండ్రి కొఱకొకండు తన పెండ్లి మానెను
ఒకఁడు యౌవనంబు నొసఁగి మెరసె
కానకేగె నొకఁడు ! కలుగరే పుత్రులు!
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 21

మాత 'జిజియ' నేర్పె నేత 'శివాజీ'కి
వీర పౌరుషములు విశదముగను
తల్లి నేర్పు బుద్ధి తనయులకబ్బును
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 22

పుట్టె భరత భూమి మోహనదాస్‌గాంధి
పుట్టె భరత భూమి బుద్ధమూర్తి
యట్టి భరత సుతులె యాదర్శ మూర్తులు
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 23

బుద్ధ జన్మభూమి c బుట్టిన నీవును
బుద్ధ బోధలట్లు భూతదయను
బూని జీవ హింస మానుట యొప్పును
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 24

విన్న వీసమైన చెడు చేయరాదను
బుద్ధదేవు మాట బుద్ధి నెంచు
జీవు లన్నిటం గల జీవాత్మ యొక్కటే
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 25

జంతు రూపములను స్తంభాల చెక్కించె
జంతు గౌరవంబు చాటు కొఱకు
జంతుబలుల నాపె సామ్రాట్టశోకుండు
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 26

పుట్టు, పెఱుగు, ధనముఁబొందు, బంధులఁగూడు,
జరయు మృతియు నందు జనుఁడు జగతి
శాశ్వతంబదేదొ? చర్చించుమాత్మలో
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 27

పోయిరెంతోమంది పొలకువ లేకుండఁ
బేరుకూడ లేదు పృథివిలోన
పరుల మేలుఁ గోర పరమార్థమది సుమా!
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 28

దీన జనులకిడని దేవతార్చన లేల?
దీన జనులయందె దేవుఁడుండు
మనుజసేవయే గద! మాధవుసేవయౌ
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 29

తీరమేదొ చేరఁదేల్చు కొనకయున్న
గాలి యెట్టిదైనఁ గావఁ గలదె?
జీవి గమ్యమెఱుఁగ జీవాత్మ దరి జేర్చు
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 30

ఎంత గింజు కొన్న నేమి చేసిన గాని
ఈశు నిచ్చులేక యెదియుఁగాదు
నామ మాత్రు ఁడంతె నరుఁడు లోకమ్మున
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 31

కాన్కలివిగొదేవ! గైకొనుమనగానె
కాన్క వెన్క భక్తి ఁ గనును శౌరి
భక్తి భావమెంతొ ముక్తి యంతయెకల్గు
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 32

కోటి రూపములను గొల్తురు భక్తితో
దేవుఁడొకఁడె యంచుఁ దెలిసి కూడ
మనసు నిల్పు కొఱకు మఱి యెన్ని యగచాట్లు
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 33

పరుల మేలుఁ గోరఁ బరమ పుణ్యంబగు
పరుల కీడు చేయఁ బాప మగును
పరుల మేలు చేసి పరుని మెప్పింపుమా
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 34

పాప ఫలము నీవు భరియింప వలెఁ గాని
దేవు వేఁడి నంతఁ దీరి పోదు;
చేయఁ బోకు మింకఁ జెనటి కార్యంబులు
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 35

పలుక వలయు శివుని పలుమారు మదినిల్పి
కొలువ వలయు విష్ణు కోర్కెఁ దీరఁ
దలఁప వలయు నజుని తలపుననిండార
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 36

ఫణి విహంగకరులు వాగురఁ జిక్కుట
రవియు శశియుఁ బొందు గ్రహణపీడ
శిష్ట జనుల లేమి దుష్ట విధిబలంబె
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 37

భావి ఘటనఁ గూర్చి భయము నాశయు లేక
బ్రతుకు చుండు వాఁడె ప్రాజ్ఞుఁ డరయ
నీశు నిచ్చ లేక యేదియు జరుగదు
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 38

శివుని యాజ్ఞ లేక చీమయుఁ గుట్టదు
శివుని యాజ్ఞ మీద భువి జరించు
శివుని భక్తి నమ్మి సేవింప క్షేమమ్ము
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 39

శివుని నాత్మఁ దలఁచి, శివుని భక్తి భజించి,
శివునిఁ గొలిచి, శుద్ధ చిత్తుఁడగుచు
మసలు వాని వలచు మఱి ముక్తి కాంతయు
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 40

శివుని యందె నిలుపు చిత్తమ్ము నెప్పుడు
పుణ్య కార్యములను బూన్కి సేయు
పాపములకుఁ బోకు ప్రాజ్ఞ వాక్యములివి
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 41

హరిని గాదటన్న హరభక్తుఁడే గాఁడు
హరుని గాదటన్న హరికి గాఁడు
హరి హరు లొకటంచు నాత్మలో నెంచుము
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 42

శివుఁడు విష్ణు రూపు శివ రూపమే విష్ణు
వాసుదేవ హరులు బ్రహ్మ రూపె
యాది దేవుఁడీవె యాత్మలోఁ దెలియంగ
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 43

క్షేత్రములకుఁ దిరిగి సేవింప నేమౌను?
పుణ్య తీర్థములను మునుగ నేమి?
చిత్త శుద్ధి తోడ శివుఁ గొల్వవలెనోయి
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 44

ఆకసంబు నుండి యవని పై బడు నీరు
సంద్ర మందుఁజేరు సరణి గాగ
సర్వదేవ పూజ సర్వే శునకుఁ జేరు
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 45

పనికిఁ బ్రాలు మాలి భగవంతుఁ బ్రార్థింప
దేవుఁడు పకరించి కావఁబోఁడు
నరుఁడు కృషి యొనర్ప హరుఁడు ఫలంబిచ్చు
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 46

జపము తపము నిష్ఠ జన్మతో కలుగవు
వానిఁ బొందు వాఁడె బ్రాహ్మణుండు
బ్రహ్మ విద్య నెఱుఁగ బ్రాహ్మణుఁడనఁబడు
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 47

బ్రాహ్మణుఁడన వానిఁ బరిగణింపరునేఁడు
బ్రాహ్మణుఁడన నెంతొ భక్తి నాఁడు
బ్రాహ్మణుఁడు వసింప వలె నూరి కొకఁడైన
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 48

ఏమి పండితుడో? ఏమి పాండిత్యమో?
జగతి నెల్లఁదెలిసి జన్మఁదెలిసి
ప్రగతిఁ గూర్చు నదియె పాండిత్యమననొప్పు
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 49

కూర్చు రూపము; కడు గూఢ ధనమ్మగు;
భోగమిచ్చు; యశము పొందఁజేయు
విద్య కంటె లేదు విత్తమ్ము జగతిలో
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 50

విద్యయున్న నేమి విడువంగవలె దుష్టు;
భయముఁ గొల్పుఁ గాదె ' ఫణి ' ఫణాగ్ర
రత్న భాసురమయి రంజిల్లుచున్నను;
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 51

తన్ను తాను గెలువ ధరణినే గెల్చును
నిగ్రహంబు వలన నెనయు సుఖము
ఆత్మ దర్శనునకు నన్నిట విజయంబె
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 52

ఏను స్వాములనుచు నెంగిలి మాటల
బలికి సేవలందు బడుగు జడుఁడు
తత్వ మడిగి నంత తబ్బిబ్బు పడుచుండు
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 53

వారణాసి కేగ వదలునా పాపమ్ము
కట్టి కుడుపు సుమ్ము కర్మ ఫలము
పుణ్య కార్యములను బూన్కితో జేయుము
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 54

కుండ లెల్ల వేఱు; కూర్చు మన్నొక్కటే!
వరుస నగలు వేఱు; పసిడి యొకటె!
అట్టె జీవులందు నాత్మలో పరమాత్మ!
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 55

జగతి రంగ భూమి జనులందు నటకులు
పర్యవేక్షకుండు పద్మభవుఁడు
నల్గురెన్నునట్లు నటియింప వలెజీవి
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 56

పుట్టి నట్టి జీవి గిట్టుట నిజమంచుఁ
దెలిసి కూడ జనులు తెలివిమాలి
నాది నీది యంచు వాదింతురెందుకో?
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 57

పృథివిఁబడిన బిడ్డ యేడ్చుఁ 'గావు'మనుచు
'హాయిరా!హుళక్కి' యనును తల్లి!
జగతి మిథ్య యనుచు జనని యే చాటును
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 58

జీవనంబు, వయసు, సిరులు దారాసుతుల్
శాశ్వతములు గావు జనున కెపుడు
ధరణి శాశ్వతంబు ధర్మంబు గీర్తియు;
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 59

తనువనిత్యమగును ధనమశాశ్వతమగు
మృత్యు వెపుడు వెంట మేలఁగుచుండు
ధర్మ సంగ్రహమ్ము తగు చర్య జనునకు
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 60

తప్పు చేయువాఁడు మదినిఁ దన్నెవ్వరు
గాంచరంచు నెంచు కించు బుద్ధి,
సర్వ సాక్షి శివుఁడు సకలంబు గ్రహియించు
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 61

తీయఁ దీయఁ జలము తీయని నీరిచ్చు
చదువఁ జదువఁ దెలివి చాలయబ్బు
మనసు నిల్పు కొలఁది మఱి ముక్తి యబ్బురా
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 62

నాది నీది యనుచు వాదులాడుట యేల?
ప్రాణముండు వఱకె ప్రాకులాట;
ప్రాకులాట మాని భజియింపు మీశుని
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 63

పుణ్య కార్యములను బూని చేసితిఁగాని
వచ్చెఁగష్ట మనుచు వగవఁ బోకు
మనుభవింప వలయు వెనుకటి కర్మంబు
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 64

నేల, నీరు, నిప్పు, గాలి, యాకసమును
పరఁగె మొదటి నుండి ప్రకృతి రీతి!
నాది నీది యంచు వాదింతు రేలనో?
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 65

పసులు, సతులు, సుతులు, వసతులు సంపదల్
కలియు వీడు వరదఁ గట్టెలట్టు
లవియె సుమి! జనుని ఋణానుబంధమ్ములు
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 66

పరధనము మట్టి పరసతి తనతల్లి
అన్ని భూతములును నరయ తానె
అనుచు పండితుండు కనుచుండు నాత్మలో
సిద్ద సేవ్య ! దివ్య! సిద్దులయ్య. 67

ఒరుల బాధలెఱింగి యోపిన యంతకు
బాధ తీర్చుచుంట బాధ్యతయని
కరుణఁ జూపు పుణ్య పురుషుఁడు గావలె
సిద్ద సేవ్య ! దివ్య! సిద్దులయ్య. 68

బోడిఁ గొట్టఁ గానె యూడునా కోర్కెలు?
గడ్డమున్న యంత దొడ్డ యగునె?
మనసు శుద్ధి చేసి మసలంగవలెనోయి
సిద్ద సేవ్య ! దివ్య! సిద్దులయ్య. 69

మట్టిలోన బుట్టి మట్టి లోనఁబెఱిగి
మట్టిలోనఁ గలియు మనుజ జన్మ
మట్టి యందు నీదు గట్టి తనము నిల్పు;
సిద్ద సేవ్య ! దివ్య! సిద్దులయ్య. 70

ముష్టి పండుఁ జూడ ముచ్చటగా నుండి
విప్పి తిన దలంప విషము గాదె
మనుజునందు గుణము మదివిప్పి కనవలె
సిద్ద సేవ్య ! దివ్య! సిద్దులయ్య. 71

మ్రొక్కినాఁడ వరము లెక్క డిచ్చెను దేవుఁ
డనుచుఁ దిట్టఁ గూడ, దాత్మ శుద్ధి
తోడ సేవ సేయఁ దోచి కోర్కెల దీర్చు
సిద్ద సేవ్య ! దివ్య! సిద్దులయ్య. 72

రాజు లేగి నారు; రాజ్యాలు పోయెను
మూట వెంటఁ గొంచు పోయి రెవరు?
వారి కీర్తి నిలచె వసుధ శాశ్వతముగ;
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్దులయ్య. 73

పూర్వ జన్మకృతము పోవునా తప్పింప
ననుభ వింప వలయు నజున్కై న
సీత రాము బాసి చెందదా కష్టాల?
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్దులయ్య. 74

ఎంతవాఁడు గాని, యెందరున్నను గాని
యెంత యున్న గాని యేమి ఫలము
కట్టి కుడువఁజేయు కర్మఫలంబది
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్దులయ్య. 75

అమ్మ, యక్క, యాలు, నమ్మమ్మ యత్తయు
నందరాడు వారె యరసి చూడ
వారి గొప్పఁ దెలిసి వర్తించు చుండుము
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్దులయ్య. 76

తివిరి యత్తి పూలు తెల్లని కాకులు
జలములందుఁ జేప జాడలేని
కాననగును, కాదు కాంతలమదిఁ గాంచ
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్దులయ్య. 77

ఓటికుండ తోడ నొరఁగఁ బెట్టుచునైన
కాపురంబు సేఁత ఘనము గూర్చు
పారవేయు దాన ఫలమేమి కలుగును?
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్దులయ్య. 78

చదువు నేర్వగలరు, శాసించి యరులను
బృధివి నేలఁగలరు పేర్మిమీర
స్రీలు నేర్తురన్ని చెల్వార నేర్పింప
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్దులయ్య. 79

ఒకతె జోలఁబాడె నొగి త్రిమూర్తులకును
జముని పోరి యొకతె జయముగాంచె
సూర్యు నొకతె నిల్పి చూడరా పతిభక్తి
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్దులయ్య. 80

బ్రహ్మ విష్ణు శివులు వాగురస్తనువుల
స్త్రీల గారవించి చేర్చు కొనిరి
పడఁతి ఘనత నెఱిఁగి వర్తింపు మెప్పుడు
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్దులయ్య. 81

ఆలు దొంగ యైన నగచాట్లు తప్పవు
ఇంటి దొంగఁబట్ట నీశు వశమె?
ఇంటి పాలనంబె యిల్లాలిదని పల్కు
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్దులయ్య. 82

కడుపు చూచు తల్లి ముడుపు జూచును వేశ్య
అప్పు నొసఁగు నాతఁ డాస్తి చూచు
నాలు సుఖము చూచు నవనిలో నిజమిది;
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్దులయ్య. 83

ఆలి వంక వారె యాత్మ బంధువు లండ్రు
బావమఱఁది యెపుడు బాగుఁగోరు
ఆలు మంచి నెంచి యలరించు సౌఖ్యాల
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్దులయ్య. 84

కాంత కంటి నీరు గార్చిన నింటిలో
సిరి వసింప నోడు; చెలువు తఱుఁగు
కాంత లక్షణములె కాంతుని యున్నతి
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 85

ముద్దు మోము నుంచి బుద్ధి బలంబుంచి
సౌకుమార్య ముంచి సరసముంచి
సృష్టిఁ జేసె బ్రహ్మ స్త్రీ జాతి నది యెంచు
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 86

తప్పుటడుగు వేసి తల్లడిల్లెడు సతిఁ
జక్క నిల్పు వాఁడె సరసుఁడరయ,
తప్పు దిద్ది తీర్చి దరి జేర్చుటయె లెస్స
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 87

జాతి కులము మతము జన్మతో రావయ్య
మధ్యలోన వచ్చి మధ్యఁ బోవు
నెందు కింత రచ్చ యెఱుగరే జనులెల్ల
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 88

బాట కేది కులము? భాండము కులమేది?
చెప్పుదే కులంబు చెప్ప లేరు;
మనుజున కెటువచ్చె మఱి కులభేదాలు?
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 89

మట్టి లోనఁ బుట్టి మట్టిలోఁ బెరుగుచు
మట్టి లోనఁ గలియు మనుజ జన్మ
మట్టి కులమదేదొ మనుజు కులంబదె
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 90

అట్టడుగున నున్న నల్పుఁడంచనుకోకు
దుమ్ముక్రింద నుండి దొరకు పసిడి
మనుజు గొప్పఁగాంచు మా గుణ రాశిచే
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 91

మనుఁజుఁడేమి చేయు మనుజుని; దైవమ్ము
తప్పకున్న? నదియె తగిన రక్ష;
భారతమ్ము నీతి సారమ్ము దెలియుమా
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 92

నాది యేమిలేదు నారాయణుఁడె యెల్ల
యని తలఁచి భజింప నతఁడె ప్రోచు
భాగవతము నీతి సారమ్ము దెలియుమా
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 93

శరణు గోరి వచ్చు శత్రువు నైనను
ప్రేమ జూపి యాదరించుటయును
ప్రబల మైన నీతి రామాయణం బిచ్చు;
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 94

అల్ప జనునకైన నణఁగి వర్తించును
కార్య సాధకుండు ఘనత విడచి
ఖరము కాళ్లు బట్టె గద వసుదేవుండు
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 95

ఆశ్రయించు వారి యాపదలంబాపఁ
బ్రాణమైన విడచు వ్రతము నాది
యనెడు రామ వాక్య మనుసరణీయమ్ము
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 96

నిశ్చలంపు భక్తి నియమిత దీక్షతో
హరిని గొల్వఁ దీరు నభిమతంబు
ధ్రువుని కేశవుండు ధ్రువతారఁ జేయఁడే
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 97

కదన మందు గెలువఁ గాలకంధరుఁ గూర్చి
ఘోర తపము సేయఁ గుంతి కొడుకు;
వాని మెచ్చి శివుఁడు పాశుపతంబిచ్చె
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 98

కవచ కుండలములు కపటి ఇంద్రున కిచ్చె
నడుగు వారి కిచ్చె నడిగి నట్లు
కర్ణు దాన మహిమ వర్ణింప తరమౌనె?
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 99

చిన్న నాటి సఖుని శ్రీకృష్ణు దర్శింప,
నా కుచేలుఁ డందె నమితసిరుల
ఆపదలను దీర్చు నాతఁడే హితుఁడన
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 100

నిరత దాన శీలి పరదార విముఖుండు
స్నేహమయుఁడు మాట నిలుపువాఁడు
వీర కర్ణుచరిత విని గ్రహింపుము నీతి
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 101

జూదమాడి ధర్మ సుతుఁడోడె రాజ్యమ్ము
సోదరులను సతిని, ఖేదపడుచు
నడవిఁ దిరిగె నుండె నజ్ఞాతవాసమ్ము
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 102

దిక్కు నీవెయనుచు దేవదేవుని వేఁడ
కష్టములను దీర్చి కాచు బ్రోచు;
కరిని బ్రోచె మకరి ఖండించి శ్రీహరి
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 103

శివుని మెప్పుఁ పొంది భువికి గంగను దెచ్చె
నార దీక్షనా భగీరథుండు !.
పట్టు విడువకున్న పరిపూర్ణ జయమబ్బు
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 104

కంభ మందుఁబుట్టి కాచెఁ బ్రహ్లాదుని
జీల్చె నసురు నార సింహుఁడగుచు
భక్తిఁ గోర శౌరి ప్రభవించు నెందైన
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 105

పరుల కుపకరించు భాగ్యంబు తనకబ్బ
వరము వేఁడు శేషు వసుధ మోయ
శౌరి నియతి సేయ సర్వంబు తలఁదాల్చె;
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 106

పావురంబుఁగావ పలలంబు తన నుండి
యిచ్చు శిబిని గాంచి మెచ్చెదేగ;
శిబిని బోలు దాన శీలివి గావలె
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 107

దాన ధర్మములను దాఁ జేయఁదలఁచిన
బలి దధీచి కర్ణ ప్రముఖులట్లు
మాట నిల్పు కొనుట మానవ ధర్మంబు
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 108

బాధ లొందవె నంచు బావురు మననేల?
నమర పతికి గలిగె నసుర బాధ;
బాధ లోర్పుతోడ భరియింపఁదొలఁగును
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్దులయ్య. 109

భక్తుఁ గావ నెపుడు భగవంతుఁడుండును
నెమ్మనమున నతని నమ్మియున్న
కాలునణఁచి శివుఁడు కాచె మార్కండేయు
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్దులయ్య. 110

బ్రహ్మ పుత్రి సంధ్య భవు గూర్చి తపియించి
బుట్టె యజ్ఞ గుండమున, వసిష్ఠ
సతి యరుంధతియయి, చదల రిక్కగ నిల్చె!
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్దులయ్య. 111

రాజ్య మోడిపోయె, రమణిని నెడఁబాసె
వలువ పక్షి కొనఁగ వంత నెందెఁ
గలిగె నిన్ని పాట్లు నలునకు జూదాన
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్దులయ్య. 112

సత్యదీక్ష కొఱకు సతిని సుతుని నమ్మె
కల్లు మోసె వల్ల కాడు కాచె
నాలి జంపఁ గడఁగె నా హరిశ్చంద్రుండు
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్దులయ్య. 113

రంకు నేర్చినమ్మ బొంక నేర్వక పోదు
రంకు బొంకు చేరి రమణిఁ జెఱచు
రంకుచే నహల్య రాయిగా మారదా
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్దులయ్య. 114

మద్య పానమునను మడసిరి యాదవుల్
శుక్రు విద్యయడఁగె సురమదమున
దాన మద్య సేవ తగదు మానవునకు
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 115

సంగ రహితుఁడేని సామాన్యుఁడేయగు
ముగుదఁగాంచి నంత మోహమెక్కు
గాధి సుతుడు మేన్కఁ గని మోహమందడే
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 116

ఉన్నదెల్ల నిచ్చి యుం డె పాతాళాన
దానగుణమె మూర్తి దాల్చెనేమో?
పరగ త్యాగమున్న బలిచక్రవర్తిదే
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 117

గడ్డి నొసఁగ నావు కమ్మని పాలిచ్చు
పాలు వోయ పాము పట్టి కఱచు
సాధు దుష్టజనుల సహజ భావము లివి
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 118

కాళి నెపము వెట్టి ఖండింత్రు జీవాల
మాంస భక్షణంబు మరుగు కతన;
నంబ కానుపించి యడిగెనా బలులను
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 119

కోడి చిలుక నెమలి కోయిల కూఁతలు
విను మదెంత హాయి వీనులకును;
నట్టి పక్షి జాతి నరయుమా దయతోడ
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 120

కుక్కుటంబు తెలివి కుక్క విశ్వాసమ్ము
చిలుక కులుకు పలుకు చీమ పొదుపు
జలగ గట్టి పట్టు తెలిసి మెలంగుము
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 121

చిలుక పలుకు లెంత చెవికింపుగా విం(దు
గూబ కూఁత కేల కోప గిం(తు
పలుకు మార్దవంబె పదిమంది మెత్తురు
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 122

చీమ బారు లేని శిల పైనఁ (బాకిన
దారి కలుగు చుండుఁ దథ్యమట్లె
వినఁగ వినఁగ నీతి మనసునకంటును
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 123

పలల మందపేక్షఁ బశువులఁ జంపుట
పాడి యగునె? యదియుఁ బాపము గద!
(ప్రాణమెట్లో నీకు పశువులకునునట్లె;
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 124

ఎల్ల (ప్రాణులందు నీశ్వరుండుండును
(బాణి నొవ్వఁ జేయఁ బాప మగును;
(ప్రాణిహింస తగదు పరికించి చూడంగ
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 125

(ప్రకృతి రక్షకొఱకు బహువిధ జీవాల
(బహ్మ సృష్టి చేసె వసుధయందు
పశువులందు (ప్రేమ పరమేశ్వరుని తృప్తి
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 126

బాధ కలిగి నపుడె పట్టి కఱచు పాము
కఱచు నేమొ యనుచు నరుఁడు చంపు
ప్రాణ భీతి యందు బాడి తలంపరు
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 127

మనుజు జూచి పాము మఱిమఱి భయపడు
పాముఁ జూచి మనిషి భయముఁ జెందు
నెంచి చూడుమిందు మంచియు చెడ్డయు
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య 128

రంగు రంగు లెసగ నింగి నేలఁ జరించు
పక్షి జంప నేల కుక్షి నింపఁ
బక్షిఁ గాంచి జ్ఞాన చక్షువున్ దెరవరా
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 129

చెడు పలుకకు మనుచు చెడును వినకు మంచు
చెడును కనకు మనుచుఁ జెప్పె గాంధి;
ఆ మహాత్ము జాడ లా దర్శము గఁగొను
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 130

కుష్ఠ కురుపు తోడ కుములు రోగులఁ జూచి
కడిగి మందు వేసే ఘనుఁడు గాంధి;
ఆ మహాత్ముజాడ లాదర్శముగఁగొను
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 131

మాలలందుఁ బుట్టి మైత్రితో మెలఁగుచు
వారి బాధ లెల్లఁబంచు కొనఁగ
దేవదేవుఁగోరె దీనబంధుఁడు గాంధి;
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 132

ఆంధ్ర కేసరి యని యన్యులే మెచ్చంగ
దేశసేవ చేసి తేజరిల్లె
కార్య శూరుఁడా ప్రకాశము పంతులు
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 133

ఆంధ్ర జాతికై నిరాహార దీక్షతో
వీర మరణ మంది వినుతి నందె
బుద్ధి నెంచు మతని పొట్టి శ్రీరాముల
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 134

కాల మెఱుఁగువాఁడు నీలము సంజీవ
రెడ్డి, ప్రజల సేవ ప్రియము గనియె
రైతు నుండి పెఱిగి రాష్ట్రపతియునయ్యె
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 135

మాట సాగునపుడె మంచి పనులు చేసి
ప్రజల మెప్పుఁగనుట పౌరుషంబు
మాట వీగి పోవ మఱి యుండునది యేమి?
సిద్ధ సేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 136

దండమనుచు, నిదిగొ ధనమంచు బతిమాలి
ప్రజల 'యోటు' పొంది పదవి నంది
పలువ తలఁడఁ డవల ప్రజల బాధ లొకింత
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 137

హక్కు నొసఁగు 'నోటు' నధికారమిడు 'నోటు'
సత్య పాలనంబు జరుపు 'నోటు'
అట్టి యోటు నరసి యర్హున కొసఁగుము
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 138

కుచ్చితుండు చేయుఁ గుటిల మర్యాదలు
బంధువట్లు చేరి బహువిధాల
వెనక తెలియు నతని పీడించు బుద్ధులు
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 139

ఏమి చేయ నితరు లేవగింతురు నిన్ను
నొకరి కదియె చేయకునికి మేలు
పరమ ధర్మమదియె పరికించి చూడరా!
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 140

అబ్బు చుండు లక్ష్మి కొబ్బరి జలమట్లు
కదలు సుమ్ము లక్ష్మి గజము మ్రింగు
వెలగ పండు గుజ్జు తొలఁగెడు చాడ్పున
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 141

ఒకరు చెప్పెడునది యోపికతో విని
వివరమెఱుగ వలయు వేగపడక
కల్ల నిజము తెలిసి గణుతించుటే లెస్స
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 142

చెనటి చుప్పనాతి చెప్పిన మాటల
నాలకించి రావణాసురుండు
సీతఁ దెచ్చి చచ్చె శ్రీరామచంద్రుచే
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 143

కత్తి దెబ్బ మాను ఘనమైన వైద్యాల
ఖలుని నిష్ఠురోక్తి గాయమైన
మనసు, మానదెట్టి మందుల నైనను
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 144

కలసి యుండ వలయు గ్రామ మంతటితోడ
మంచి చెడ్డలరసి మసలవలయు
నున్న యూరెనుమ్మ కన్నతల్లి సమంబు
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 145

కష్టకాలమందు కనుమీవు మిత్రుని
యుద్ధమందు గనుము యోధవరుని
ఆగ్రహమ్ము పుట్టనరయు వివేకిని
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 146

కూడు తినుట కాదు గుడ్డ కట్టుట కాదు
యింటి యందు వాసముంటకాదు
అరయువలయు నెప్పుడనదల యగవాట్లు
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 147

కుంటి గ్రుడ్డి ముసలి కుష్ఠ రోగుల జూచి
జాలిఁ దలచు వాని జన్మ జన్మ
దీన జనులసేవ దేవతార్చనమగు
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 148

కోపగింప రాదు కొనసాగు-కార్యాల
శాపమిడగ రాదు శత్రుకైన
సహనమున్నఁజాలు సర్వంబు సమకూరు
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 149

నడత కొలఁది ఫలము నలువురిలోపొందు
నూరుమారినంత సారమేమి?
ఘటము కొలఁదె నీరు గంగలోముంచినా
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 150

తాటి చెట్టు క్రిందఁ ద్రావిన పాలును
కల్లటంచ్రుజనులు; కాన నిలుచు
చోటు బట్టి గుణము శోభిల్లుచుండును
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 151

ఈయఁదలచినపుడె యీవలనేదేని
తడవు చేసినంతఁ దలఁపు తిరుగు
దాన మిచ్చు వాఁడె ధనవంతుఁడీ ధర
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 152

కోరు కొనును పేద కోర్కెల నొకకొన్ని
కోరు కొనును భోగి కోర్కెలెన్నో
ఆశపోతు కోర్కెలన్నింటఁదలఁదన్ను
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 153

దొంగతనము సేసి దోపిడు లొనరించి
దొంగ నోట్లు గొట్టి దోచు వారి
కాలయముడు పట్టి కఠిన శిక్షలు వేయు
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 154

ధనము గడన సేయు, దాని రక్షణసేయు
దానిఁ బెంప, దాని తరుగుఁ గనఁగఁ
జింత యొదవు; కాని చేర్చనగు ధనంబు
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 155

ధనము బలము కాదు తన్ను కాపాడంగ
దైవ బలమె యెపుడుఁ దన్ను గాఁచు
దిక్కు లేని వారి దేవుఁడే గాపాడు
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 156

పసిఁడి సేయఁదలచి పాటు పడుట యేల?
ధనము కొఱకు దొంగతనమదేల
కాయకష్టమునను గడియింపవలెనోయి
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 157

పసిఁడి సేయు పిచ్చి భ్రాంతితో కొందరు
ఉన్న ధనము కూడ నూడ్చు కొంద్రు
వృత్తి విద్య చేత విత్తార్జనము మేలు
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 158

మూఁడు గతులు దాన భోగ నాశమ్ములు
ధనమునకగు; నందు దాన భోగ
గతులు లేని ధనము కడకు నాశమ్మొను
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 159

పరఁగ జ్ఞానమునకుఁ బ్రాబల్యు మూలమ్ము
గృహిణి మూలమింటి కిలకు ధనము
మూలమగు, గృహస్తు మూలమ్ము ధాన్యమ్ము
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 160

పొదుపు సేయు నతఁడు పొందును సౌఖ్యాలు
ఖర్చుమించి సేయఁ గష్టమగును
ఉన్నవారి కడనె యుందురుజనులెల్ల
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 161

కన్న బిడ్డ లైనఁగడకు భార్యయు నైన
బంధులైన మిత్ర వరులెయ్యైన
గడన గల్గ నపుడె గణుతింత్రు వ్యక్తిని
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 162

మనుజు గాంచ లేఁడు మాటాడనేరఁడు
వినఁడు పలుకు, బిఱ్ఱ బిగిసియుండు
విత్త మత్త రోగి వీక్షింపఁ బాపంబు
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 163

కన్న తల్లియైన నన్నదమ్ములైన
పుత్రుఁడైన ప్రాణమిత్రుఁడైన
ధనము నందు సమ్మదగదంద్రు పెద్దలు
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 164

వయసు నందు గడన వార్ధక్యమున కయి
పొదుపు సేయువాఁడు పొందు సుఖము
చీమ పొదుపుఁ జూచి జీవించు మెప్పుడు
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 165

సంపద గలవాఁడె సత్కులుండుబుధుండు
శాస్త్రి, కర్త, పలుకు జాణ, రూపి
పణము నాశ్రయించు గుణములన్నియుఁ జుమి
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 166

సిరి యశాశ్వతంబు; వినుగు బొంతయు ముంత
నావి పేదరికము నాటివనుచు
వినుగు బొంతదాఁచె శ్రీమంతుఁడొక్కండు
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 167

వట్టిపోవు నీరు, గట్టి మ్రాకులుపడు
పదువులు నశియించు జరుగజరుగ
హంతము దత్తముండు నుర్వియుండెడుదాక
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 168

పొత్తు కుదరనపుడు, పొందిక లేనపుడు
వేఱొకండు చేర, మేఱమీఱ
ప్రాణ హాని కాన రంకు బుద్ధి తగదు
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 169

వ్యభిచరింపఁ గల్గు నపవాదు నైచ్యమ్ము
బలము ధనము తఱుఁగు, భార్య రోయు
వ్యాధి కలుగు; గాన వ్యభిచరించుట గాదు
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 170

లేదు భయము, లజ్జ లేదు, జంకును గొంకు
నీతి లేదు, నియమ నిష్ఠ లేదు,
పాప వరుస లేదు వ్యభిచారపరునకు
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 171

ఒళ్లు పుచ్చియున్న క్రుళ్లి కంపగుచున్న
చీము కారు చున్న చెనటి కుక్క
యాడు కుక్కఁ గనిన నాడించు తోకను
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 172

కోడి రూపుఁదాల్చి కొక్కొరోయని కూసి
అల పురందరుండహల్యఁబొంది
పాపియై మునీంద్రు శాపమ్ము నందఁడా?
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 173

కండ కావరమున కామమ్ము పైకొన
గోడ లెక్కి దూకి కుజనుఁడెపుడు
నింద పొందు చుండు నిజమిది మఱువకు
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 174

వినఁడు కనఁడు నొరుల, వెఱ్ఱియై చరించు
చదువు విస్మరించు జడతఁదాల్చు
రోషమెక్కువౌను క్రోధియౌ వానికి
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 175

ప్రేమ కాన రాదు బిడియమే యుండదు
కనికరంబు సున్న కాంక్ష పెఱుగు
నట్టిలోభ గుణము నాత్మలో నెంచకు
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 176

తనివి నంద కుంట తనకె కావలెనంట
నొరుని హెచ్చుఁజూచి యోర్వకుంట
మోహ గుణములివ్వి మొదలంటఁ గూల్చుము
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 177

కౌరవాగ్రజుండు కటిక మచ్చరమున
చెడెను, పాండవులను జెరుపఁదలఁచి
మచ్చరంబు వీడి మసలిన మేలబ్బు
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 178

ఇష్టమునక చేయు కర్తవ్యమును నెప్డు
పరుల మెప్పుకొఱకు పాటుబడకు
కుంభ వృష్టి యిచ్చు కోరిన పంటల
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 179

కార్య మెంతదైన కాలయాపన లేక
చేయగడగనేని చేరు ఫలము
రేపు రేపటన్న రూపదియుండదు
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 180

బలిసి రోగములను తికియుండుటకంటె
నొరుల కుపకరించి యూడమేలు
మరలు త్రుప్పు కంటె యరగుటమేల్గాదె?
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 181

కార్మికులను జూడు కర్మాలయంబుల
ప్రాణ భీతి మాని పట్టు బట్టి
చెమట యోడ్చి పనులజేయరా శ్రద్ధతో
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 182

తనదు కష్టములను తలపోసి మనసున
నెదుటి కష్టమట్లే యెంచవలయు
కష్ట జీవిఁ గాంచి కనికరించుట లెస్స
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 183

కూలి నాలి చేసి కొండకట్టెల మోసి
కడపు జీవితంబు కష్టజీవి
యతని కష్టమెంచి యాదు కోవలెనోయి
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 184

అతిగ మాటలాడ నతిగ తిండి తినిన
నతిగ నడచు కొనిన నాపదలగు
అతిని వదలవలయు నన్ని తావులయందు
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 185

అప్పు దొరకు నంచు నధికంబు గొనరాదు
తిండి దొరకునంచుఁదినకు మిగుల
గార వింతురంచు మీరకు నీమేర
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 186

నేర్వ నేర్వ విద్య నిండుగా సమకూరు
కూర్పఁ గూర్ప ధనము కూడుచుండు
పట్టఁ బట్ట పనులు ఫలవంత మౌనురా
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 187

ఆత్మ నెఱుఁగుమా మహాత్ముల జీవితాల్
మంచి గురువు లవియె మసలు కొనఁగ
మంచి నేరుకొనుట మనుజ ధర్మముగాదె
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 188

అనువు లేని యెడల నడగి పోవలె సుమ్మ
తగ్గిపోదు నంచుఁ దలఁపనేల
నద్దమందు కొండ యల్పమైయుండదా
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 189

ఎదుటి బలము నెఱిఁగి యెదిరింపఁ బూనుము
సరిసమాను తోడ వరుసఁ గలుపు
సద్గుణాఢ్యుతోడ సహవాస మొనరింపు
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 190

ఎదుటి బాగుఁజూచి యేవగింపఁగఁ బోకు
మప్రియంపు మాట లాడఁ బోకు
శరణటన్నఁ బ్రోవు శత్రువు నైనను
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 191

గురుల గౌరవించు; గుర్తించు మనదల;
భార్యనేలు; చూపు బంధు ప్రీతి;
హితుని మేలు కోరు హితమిదిగైకొమ్ము
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 192

చెడుగు చేసి రంచుఁ జెడుగె చేయగఁరాదు
మంచి చేసి వారి మనసు దోఁచి
మంచి గూర్చు కొనుట మనుజ ధర్మంబగు
సిద్ధసేవ్య ! దివ్య! సిద్దులయ్య. 193

చెడ్డ వారి తోడ స్నేహమ్ము సేయకు
మంచి వారి గూడి మసలు మెపుడు
కాయ మస్థిరంబు కావింపు పుణ్యంబు
సిద్ధసేవ్య ! దివ్య! సిద్దులయ్య. 194

చేవఁగల్గు నిల్లు చెయి సాగు నత్తయు
మామ మెత్తఁదనము మఱఁది చిన్న
ఆలు పెద్ద దౌట యల్లుని భాగ్యమ్ము
సిద్ధసేవ్య ! దివ్య! సిద్దులయ్య. 195

తగ్గ చేసి యొరుని తనగొప్ప నగ్గించి
తార్కి కుండు పల్కు తప్పటంచు
తగ్గ వాని గొప్ప తర్కించి తెతియుమా
సిద్ధసేవ్య ! దివ్య! సిద్దులయ్య. 196

తప్పు లొరుల యందు చెప్పవచ్చును బెక్కు
చెప్పఁ డెవఁడు తనదు తప్పు నెపుడు
తప్పు వదలి యొరుల యొప్పు జెప్పుట లెస్స
సిద్ధసేవ్య ! దివ్య! సిద్దులయ్య. 197

దాత తనకు తాన దాన మీవలయును
లోభి సంప్రదింప లోభమగును
ఈయఁ డెపుడు లోభియీాయంగ నీయఁడు
సిద్ధసేవ్య ! దివ్య! సిద్దులయ్య. 198

పసితనాన విద్య వయసున భార్యయు
ముదిమియందు ముక్తి మూలము గద!
దాని నెన్ను కొనెడు వానిదే భాగ్యమ్ము
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 199

పూర్వ గ్రంధములను బూనికcజదివినc
బెద్దవారి మాట పేర్మివినిన
నబ్బు నీతి పథము నమరును సత్కీర్తి
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 200

పొంచి వినగరాదు, పొంచి కనcగరాదు,
మించరాదు;పలుకు మీరరాదు;
కొండె మాడ రాదు; కొండెంబు వినరాదు
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 201

పందికెట్లు తెలియు పన్నీరు వాసన
గాడ్దెకెట్లు తెలియు గంధపుcబస
యెద్దె కెట్లు తెలియు దొడ్డవారి గుణంబు
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 202

బంధు గౌరవంబు పాటింప వలయును
గ్రామ జనుల తోడc గలియవలయు
పేదసాద జనులc బ్రేమింపవలయును
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 203

పోలి కొకటె యగును బుద్ధులు వేరగు
యుప్పు కప్పురముల యునికి యట్లు
మనుజు లందరొకటె మతములు వేరురా
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 204

బ్రతుకు కొఱకు దినుట భావ్యంబు ధరలోన
బ్రతుకు తినుటకైన ఫలము లేదు,
బ్రతుకు సార్థకముగ ప్రగతిని కూర్చుము
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 205

మాటలందుఁ గాదుమనుజుని నిజరూపు
నడవడి యను దర్పణమునఁ గనుము
ఉన్న కొలఁది తెలియు మొకని ప్రవర్తన
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 206

మొదట సొలెగూండ్ల విధినంటు నలవాటు
లినుప సంకెల వలె వెనుక మారు
నాచరింపవలెను నాది నుండియె మంచి
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 207

చేయఁదగిన పనిని చేయుము తప్పక
శక్తి మించు పనిని సలుప వలదు
శక్తి యున్న వఱకు సాధింప వలెపనుల్
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 208

మంచి కాననగును మనుజులందు వెదకి
ఎంచరాదు చెడుగు నెప్పుడేని
దలఁచు నట్లు జనుఁడు తామారుచుండును
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 209

మంచి నెన్ని దాని మఱి మఱి పదిమార్లు
మనసు నందుఁ దలఁప మంచి గలుగు
భావమెట్టు లున్న పరిణామ మట్లగు
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 210

మంచి వినినయప్పు మంచిగనినయప్పు
మంచి మనుసులోన మసలునపుడు
మనుగడ కవి గూడి మంచిగావలెనోయి
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 211

లజ్జ దయము భయము లౌకికంబును నీతి
కల్గు హితుని మైత్రి కాంచుమెపుడు
సద్గుణాల నిచ్చు సజ్జన సంగతి
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 212

విజయ మబ్బఁగొనుము విజ్ఞాని రీతిగా
గొను విపత్తు గొప్పమనుజునట్లు
కోరినట్లు జరుగ కొదవేమి మనకింక
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 213

పుణ్యకార్యములను బూనుము నీయంత
పాపకార్యములను బరిహరించు
పుడమి నిల్చియుండు పుణ్యపాపంబులె
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 214

భరతమాత కడుపు పంటయన్న ఘనత
భారతీయుఁ డనఁగఁ బరఁగు ఘనత
భరత జాతి నీతి ప్రజ్వరిల్లవలెను
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 215

విజయ మబ్బగానె వింతలు పడరాదు
గెలువఁదగిన దేదొ గెలువ వలయు
ఘనవిజయమటంచు గనుమాత్మ విజయంబు
సిద్ధసేవ్య ! దివ్య! సిద్ధులయ్య. 216

శుభం భూయాత్!